# స్మృతిగీతి

## గుత్తికొండ రామరత్నం జీవనయానం...





కూర్పు డా॥ జి.వి. పూర్ణచందు

సంకల్పం స్పందన, భారతి, కవిత





# స్మృతిగీతి

## గుత్తికొండ రామరత్నం జీవనయానం...

కూర్పు

**డా॥ జి.వి. పూర్ణచందు**

సంకల్పం

**స్పందన, భారతి, కవిత**




ప్రచురణ

గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్ట్






# స్మృతిగీతి

గుత్తికొండ రామరత్నం జీవన యానం....

2014 నవంబరు 23....

ప్రచురణ :

గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్ట్

గృహప్రియ ఫుడ్స్, 24-388,

రామానాయుడు పేట, మచిలీపట్నం - 521 001

94401 67697, 08672 221365

చిత్రాలంకరణ :

గిరిధర్, విజయవాడ

ముద్రణ :

శ్రీశ్రీ ప్రింటర్స్

విజయవాడ-2. 94906 34849








# శ్రీమతి గుత్తికొండ రామరత్నం జీవన సాఫల్యాలు

శ్రీమతి గుత్తికొండ రామరత్నం గుంటూరు జిల్లా భట్టిప్రోలు మండలం, కనగాల గ్రామంలో జన్మించారు. శ్రీమతి ఆదిశేషమ్మ, గోరంట్ల సత్యనారాయణగార్ల తొలి సంతతి. సోదరుడు శ్రీ ఈశ్వర ప్రసాదరావు.

రమగారి చదువు కనగాల ప్రాథమిక పాఠశాలలోనూ, గూడవల్లి హైస్కూలులోనూ, చీరాల యార్లగడ్డ అన్నపూర్ణమ్మ మహిళా కళాశాలలోనూ సాగింది. ఆ రోజుల్లోనే ఆడపిల్లకు చదువెందుకు అనుకోని తల్లిదండ్రుల పుణ్యాన ఆమె చదువుకుని, మంచి పారిశ్రామిక వేత్తగా రాణించగలిగారు.

1972 జనవరి 26 రిపబ్లిక్ దినోత్సవం నాడు శ్రీ గుత్తికొండ సుబ్బారావుగారితో ఆమెకు వివాహం జరిగింది. ముత్యాల్లాంటి ముగ్గురు ఆడపిల్లలు విజయ స్పందన (1972), భారతి (1975), కవిత (1978) జన్మించారు.

**పారిశ్రామిక వేత్తగా :**

పిల్లలు పెద్దవాళ్లయ్యే వరకూ ఆమె ఒక సాధారణ గృహిణి. నెమ్మదిగా సంసారాన్ని చక్క దిద్దుకున్నారు. స్వంత ఇంటిని సమకూర్చుకున్నారు. పిల్లల్ని సాంకేతిక రంగంలో ఉన్నత విద్యావంతులుగా, నిపుణులుగా తీర్చిదిద్దారు. పిల్లలు ముగ్గురూ అమెరికాలో స్థిరపడ్డారు. క్రమేణా ఆమె పారిశ్రామిక వేత్తగా ఇంతింతై ఎదిగి సాధికారికతను సాధించారు.

1983 లో స్పందన ప్రింటర్స్ స్థాపించి, మచిలీపట్టణం లాంటి ఒక చిన్న పట్టణంలో మంచి ముద్రాపకురాలిగా వాసికెక్కారు. మచిలీపట్టణం లయన్స్ క్లబ్ వారు ఉత్తమ ముద్రణాలయ అధిపతిగా ఆమెను గుర్తించి గౌరవించారు.

పదేళ్ళపాటు ముద్రణా రంగంలో ఉండి, విజయవాడ స్వగృహఫుడ్స్ అధినేతలు కిషోర్ – విజయకుమారి దంపతులు మరియు శ్రీశ్రీ ప్రింటర్స్ అధినేతలు విశ్వేశ్వరరావు – ప్రమీల దంపతుల ప్రోత్సాహంతో 1993లో 'గృహప్రియ ఫుడ్స్' ఆహార వాణిజ్య సంస్థను వ్యవస్థాపించారు. అనేకమంది







మహిళలకు ఈ సంస్థ ద్వారా ఉపాధి అవకాశాలు కలిగించారామె! 2013లో రోటరీ క్లబ్ వారు ఆమెను ఉత్తమ పారిశ్రామిక వేత్తగా సత్కరించారు.

**కుటుంబం :**

| | | |
|---|---|---|
| పెద్ద కుమార్తె స్పందన | : | భర్త కాటాబత్తుని బాల వెంకట రమణారావు, కుమారుడు మహేంద్ర వంశీ, కుమార్తె శ్రేయ. |
| రెండవ కుమార్తె భారతి | : | భర్త మాగంటి ప్రణయ దీపక్, కుమార్తె తన్వి, కుమారుడు అర్జున్. |
| మూడవ కుమార్తె కవిత | : | భర్త జొన్నాదుల రాజేంద్రబాబు, కుమారుడు ఆర్య, కుమార్తె మాన్య. |

**ఉదారత :**

కష్టాలలోంచి వచ్చిన ఆ ఇల్లాలికి తన సిబ్బంది ఇబ్బందులు, కష్ట సుఖాలు క్షుణ్ణంగా తెలుసు. పరివారానికి మంచి చేయటానికి, వారికి బాసటగా నిలవటానికి ఆమె ఎప్పుడూ ముందుండేవారు. వాళ్ల పిల్లల పెళ్ళిళ్ల కోసం, ఇళ్ళు కట్టుకోవటం కోసం ఆమె ఎంతగానో సాయపడేవారు.

అనేక మంది పేద పిల్లల చదువులకు ఆమె చేయూత నిచ్చారు. ఫీజుల కోసం, పుస్తకాల కోసం, యూనిఫారాల కోసం ఆమెను ఆశ్రయించిన వారికి లేదనటం ఎరగని వ్యక్తి ఆమె!

**ఆధ్యాత్మికత :**

రమగారు గొప్ప శివ భక్తురాలు. శివాలయం కట్టించాలనేది ఆమె చిరకాల వాంఛ. కృష్ణాజిల్లా జగ్గయ్యపేట దగ్గర కృష్ణానదీ తీరాన ప్రసిద్ధ పుణ్య క్షేత్రం ముక్త్యాలలో శ్రీ కోటిలింగ హరిహర మహాక్షేత్రంలో శ్రీ వైద్యనాథ ఆలయాన్ని ఆమె నిర్మింప చేశారు. గుడి నిర్మాణం మొదలయ్యే నాటికి ఆమె ఆరోగ్యం చాలా వరకూ మెరుగై ఆమెలో మునుపటి చలాకీదనం చూసి అందరూ ఆశ్చర్య పోయారు. అది ఆమె శివ దీక్షాఫలంగా భావించారు.

ఎంత అనారోగ్యంలో ఉన్నా ఆమె శివధ్యాన్నం మానలేదు. యథోక్తి, యథాశక్తి, యథాభక్తి ఆమె శివధ్యాన్నంలోనే ఎక్కువ గడిపారు.







**అమెరికా యాత్రలు :**

పిల్లలు ముగ్గురూ అమెరికా వాస్తవ్యులు కావటంతో మనవళ్లతోనూ మనవరాళ్లతోనూ గడుపుతూ ఆమె మొత్తం ఏడుసార్లు అమెరికా ఖండాలను చుట్టి వచ్చారు. ఆధునిక ప్రపంచ పోకడలు ఆమెకు క్షుణ్ణంగా తెలుసు. సాంప్రదాయ జీవనశైలి పట్ల ఆమెకు అభిమానం మెండు. తన పిల్లలు అమెరికాలో కూడా తమ కుటుంబ వారసత్వాన్ని, ఆచార వ్యవహారాల్ని, సాంప్రదాయాల్ని కొనసాగించాలని ఆమె కోరుకునేవారు.

**వ్యాధి తీవ్రత :**

1995 నుండి ఆమెలో అనారోగ్యం ప్రవేశించి, ఆమెను క్షీణింపచేస్తూ వచ్చింది. వైద్యులు పరీక్షించి అల్సరేటివ్ కోలైటిస్, క్రోన్స్ డిసీజ్ అని చెప్పారు. భారత దేశంలోనూ, అమెరికాలోనూ అత్యున్నత చికిత్సలు అందించారు కూడా! వైద్యుల మందుల బలమో, తన మనోబలమో ఆమె రెండు దశాబ్దాలపాటు ఆ వ్యాధిని భరిస్తూనే నాణ్యమైన కుటుంబ జీవనాన్ని సాధించటానికి ప్రయత్నించారు.

23-11-2013 రమగారు ఆఖరి శ్వాస తీసుకున్న రోజు. ఆఖరి క్షణాలలో కూడా తాను చేయదలచిన దాన ధర్మాల గురించి, తన గుడి గురించి, తన శివుడి గురించి, తాను నెలకొల్పిన పరిశ్రమ గురించీ, అందులోని తన పరివారం గురించీ మాత్రమే ఆలోచించిన మనస్విని ఆమె!







# స్మృతిగీత

**ఆమె ఒక మానవీయ సంపద**
అరవై మూడేళ్ళ బతుకు దూరాన్నంతటినీ
మది లోపలి దిగులుతో కొలుస్తూ
సగం సగంగా పూచిన ఆశ నిరాశల్నీ,
ముక్కలు ముక్కలుగా రాలిన వెలుగు చీకట్లనీ
కుటుంబం మధ్యకి రానీయకుండా
సంసారాన్ని నిర్వహించిన సహన మూర్తి !

**ఆమె ఒక వాస్తవం**
తన చిన్న ప్రపంచంలో
పెద్ద జీవితాన్ని స్వప్నించుకుని
పదిమందికి జీవికనీ, జీవనాన్నీ
మహిళా విజయంగా
అందించిన దర్శన శక్తి !

**ఆమె ఒక ద్వీపం**
వైద్య విజ్ఞానాని కొక ప్రశ్నగా నిలిచినా
దుర్భరమైన అనారోగ్యపు మోత బరువుని
కేవలం ఆత్మ విశ్వాస సాధనంతో
అనంత అంతస్సత్వంతో
విస్తరించుకొని... ఆరేడు సార్లు
అమెరికాని చుట్టి వచ్చిన
సహజ సత్వ దీప్తి !








**ఆమె ఒక అనిర్వచనీయ కవిత**
ఒక వైపు మరణశయ్య మీద
తన వారి పట్ల మమతా సూత్రాన్నీ
మరో వైపు తన సేవికల, సేవకుల
సంక్షేమాన్నీ -- జీవుని వేదనగా
పెదవుల కదలికలలో, కనుసైగలలో
కోటి కోటి కృతజ్ఞతలని నిలిపి చూపిన
ఉత్తమోత్తమ మానవతా కీర్తి !

**ఆమె ఒక మారుతం**
ఆనందపు చిరునవ్వుల రాగాలకూ
కలతల చిరుజల్లుల తానాలకూ
శ్రుతి లయల్ని అలవోకగా కూర్చుకుంది!
కార్యదీక్షా దక్షతల చెట్టంత మనిషిగా
తన భర్త - - మా సుబ్బారావు --
ఎదుగుదలకి నిండు సహకారాన్నిచ్చింది.
తనయ త్రయాన్ని సద్గుణ సంపన్నంగా
అల్లుళ్ళ మంచితనాన్ని ఆప్యాయంగా
మనవల, మనవరాండ్ర మురిపాల్ని
కొత్త ఆహ్లాదంగా నిర్వచించిన
అ -- సామాన్య గృహిణీత్వ సత్కృతి !

**ఆమె ఒక వినమ్ర స్థితప్రజ్ఞ**
పరమేశ్వర దేవాలయ నిర్మాణం చేయించి
ఆధ్యాత్మికంగా అస్థిత్వ కావ్యాన్ని రాసుకుంది !

ఆ -- 'రామ రత్న' వ్యక్తిత్వం--
ఆత్మీయులందరికి
"మంచితనానికే" విలువైన స్ఫూర్తి !
ఆమె... ఒక "స్మృతిగీత"!!

**- విహారి**








# రమా...నేనూ... విరామం

కాననంలో పరిమళించిన కుసుమారత్నంలా, నిస్తేజ, నిర్మోహ, నిగర్వ రమ్య శిలాశిల్పంలా, సోలి వాలిన లతాగ్ర కిసలయంలా, రాలిన పక్వపత్రంలా... ఆమె!

బంగారు బొమ్మకొక గోడచేర్పులా నేను...నేను కాలాన్ని!

లోక ఘటనాఘటన నటులు మరిచిన మాటల్ని, నల్ల తెరల వెనకే నిలబడి అందించే నేపథ్యగాత్రం ఆమె! మనుషుల్ని మరిచి, మంచితనాన్ని మరిచి ఎవరి కర్మకు వాళ్ళని బాధ్యుల్ని చేసే "కర్మగానా"న్ని నేను...!ఏదీ "పట్టనివాళ్ళ" కర్మాగారాన్ని నేను...!

మహాభారత పర్వాల్లా పద్దెనిమిదేళ్ళుగా పేగుల్లో పలుగులు దిగి, అనునిత్యం ప్రాణాలను తవ్వి తోడేస్తుతున్నా, ఒక్క సారైనా "అబ్బా! ఈ బాధని భరించలేకుండా ఉన్నా"నని అని ఎరగని ఒక సహిష్ణుత ఆమె స్వంతం! అన్ని పర్వాలూ దాటుకొచ్చింది గానీ, ఆఖరి పర్వంలో ఆమె ఆగిపోక తప్పలేదు!

వ్యాధి వెన్నాడుతున్నాసరే, ఉత్తమ మహిళా ముద్రాపకురాలిగా తను పురస్కారం పొందింది. వ్యాధి పూర్తిగా శరీరాన్ని తినేసి ఎండిన మోడులా, ఎగిరిపోయిన పక్షి గూడులా జీవితం విలవిల లాడుతున్నా, తను ఉత్తమ మహిళా పారిశ్రామిక పురస్కారం పొందింది. అంత ఓపిక నాకే ఉంటే నేను కాలాన్ని అంటే, నల్లదాన్నని ఎందు కనిపించుకునే దాన్నీ? రమ్యంగా "రమ" అనే సార్థక నామధేయురాలి నయ్యేదాన్ని! నేను కాలాన్ని. లోకం కష్ట సుఖాలతో నిమిత్తం లేని నిర్లిప్తని!

నా గురించి అనాదిగా అందరికీ తెలుసు... పంటి బిగువున ప్రాణాన్ని నిలబెట్టుకో గల శక్తి నాకూ ఉందని ఎవరూ నా గురించి ఇంతలా చెప్పుకోలేదు.








నేను కాలాన్ని! అమ్మప్రేమ తెలియని దాన్ని! అమ్మ ప్రేమను పంచటమూ తెలియని దాన్ని. గోరుముద్దలు తినిపించి లోకాన్ని కన్నబిడ్డలుగా సాకే గుణాలేవీ లేని దాన్ని! నేనొక అపష్టువుని! రమ అలా కాదు, తాను ముగురమ్మల మూలపుటమ్మ! రత్నాల్లాంటి ముగ్గురమ్మాయిల కన్నతల్లి! తనకు మగ పిల్లల్లేరనో. అందరూ ఆడపిల్లలే ననో ఏనాడూ అనుకుని ఎరగని అసలైన అమ్మ! సీమలూ, సప్తసముద్రాల ఎల్లలూ దాటి, ఆ మెరకన జాతిరత్నాలై వాళ్ళూ వెలిగేలా చేసిన నేర్పరి! తన బిడ్డల భవిత కూర్పరి! ఆ అమ్మకు పుట్టిన అదృష్టవంతులు రామరత్నంగారి "కన్నరత్నాలు". తనకు ఒంట్లో బాగోలేదని ఏనాడైనా ఆమె అనుకుంటే గదా... ఇంత భారం మోయలేనేమోనని ఆమె భయపడటానికి!

ఆమెది వర్తమాన యుగం. ఆమె ఘనత భవిష్య సందేశం. నేను ఎప్పటికీ భూతకాలాన్నే! నాకు వర్తమానం అనేది లేదు. ఉన్నదనుకునే లోపు నేను భూతానికి జారిపోతాను. అలా జారిపోయేదాన్ని... నన్ను పట్టుకుని, నన్ను నమ్ముకుని "జగదాధారి" అంటుంటారు చాలామంది! రమకు నామీద ఏమాత్రం నమ్మకం లేదని నాకు బాగా తెలుసు. తన పైన తనకు గల నమ్మకమే ఆమె నొక "భావ్య"ను చేసింది. రేపటిలోకంలో జీవించేలా చేసింది.

ఏ పొద్దుకా పొద్దు నేను డ్యూటీ వేసుకుని వెళ్ళి, ఆమెని పలకరించే దాన్ని... జీవితంలో ఇన్ని ఏళ్ళ ఇన్ని రోజుల ఇన్ని పూటలు గడిచిపోయాయని గుర్తు చేసేదాన్ని! ఆమె నవ్వి ఊరుకునేది!

తను, ఎందరినో ఆదరించి ఆదుకునేది. ఇంకెందరో పేదలకు చదువిచ్చి, పుస్తకాలిచ్చి, బ్రతుకిచ్చేది! అందరినీ ఆహ్వానించి అతిథి మర్యాదలు చేసి పంపేది. ఆమె చేతిభోజనం తినని వాళ్ళెవరు? కానీ, ఒక్కనాడైనా "వచ్చావా...రా.. కూర్చో" అని నన్ను పట్టించుకుని పలకరిస్తే ఒట్టు!

నేను కాలాన్ని! ఆమె "కాలాతీత"! నేను చిరంతనని! ఆమె నిరంతర! ఆమె అధునాత! ఆమె ఆయత!

డా. జి వి పూర్ణచందు







స్మృతిగీతి

# పలుకే మౌనమాయే!

కరిగిపోతున్న కాలం
కబుర్లని నెమరేస్తోంది !
'రమ'తో పరిచయానికి నాంది ఎపుడో గుర్తులేదు,
ఉన్నదంతా చిక్కగా అలముకున్న స్నేహ సురభిళం
ఏడేళ్ళ మా మైత్రీ బంధం సప్తస్వరాన్విత
అరమరిక లెరుగని కుటుంబ స్నేహ నవ్యసుమభరిత.

ఆతిథ్యంలో అన్నపూర్ణ ! మిత్రుల మనసెరిగి మసలుకునే ప్రపూర్ణ
అమ్మగా, భార్యగా, యజమానురాలిగా, స్నేహితురాలిగా
విభిన్న వ్యక్తిత్వానికి ప్రతీక
తనని తానే నిర్వచించుకున్న తూలిక !

కుటుంబ సౌభాగ్యం, వ్యాపార వైభోగం నయన ద్వయమైన కల్పవల్లి!
ఇంటి ఇల్లాలికి సహజమైన అలకలు, అభిప్రాయ భేదాలు, చిరుకోపాలు
అంతలోనే "సరేలే" సమన్వయాలు పంచిన పాలవెల్లి !
మహిళా సాధికారికతను 'గృహప్రియ'లో నిలిపి మురిసిన రంగవల్లి!
మిత్ర బృందంలో జ్యోత్స్న దీపమై
ఆశయాలను, ఆదర్శాలను గౌరవించి, మర్యాదించి
నెనరైన నిండు మనసును పంచిన నెచ్చెలి.

జీవన గాఢతని తేలికచేసి, మనసుకు కులాసా నేర్పే హాస, దరహాసాలకు
పూలమ్మి బుట్టలోంచి ఏరిఏరి ఎంపిక చేసి అల్లిచ్చిన మల్లెల మాలలు కానుకలు నాకు !
కలసి వెలిగించిన కార్తీకదీపాలు, దర్శించిన దేవాలయాలు,
మనసు విప్పి పంచుకున్న మాటల మూటలు
కలసి చేసిన ప్రయాణాలు, గడిపిన రోజులు








మరువపు పరిమళంలా మైత్రిని హృదయానికి హత్తి
మా మంచి హితైషివంటూ అలరించిన ఆత్మీయాభిమానాలు
నా అత్తారింటి దారిలో హాయగు మజిలీలు.
'ఉండిపోరాదా' అనే మనస్ఫూర్తి ఆహ్వానాలు
వంశీకుంజానికి స్నేహనికుంజ్‌కి వారధులు !
కడదాకా పక్కనే నిలిపిన - జన్మాంతర అనుబంధ అనురాగ దీప్తులు.

విధిలీలా విక్షోభ, విహ్వలతా జ్వాలను నిరంతర భగవన్నామ స్మరణతో
మొక్కవోని ఆత్మవిశ్వాసంతో
అంతరంగ అంతర్వాహినీ తరంగాలలో చల్లార్చి
జీవనయానమే యాగంగా 'మనీషి'గా జీవించిన యోగసాధనలో
'ముక్త్యాల', 'వైద్య'నాథ 'జ్యోతి'ర్లింగ స్థాపనతో బతుకు సార్థకం చేసుకుని
పుణ్యలోకాల్లో స్థానం సుస్థిరం చేసుకున్న పునీత
సకలజన శ్రేయోభిలాషిణి రమ....

**- డా॥ కె.బి.లక్ష్మి**






# చావు పుటక లేనిదమ్మ... నీ మనుగడ !

జ్ఞాపకాలు ఎంత గొప్పవంటే గతాన్నంతా తవ్వి దోసిళ్ళతో ఎత్తి పోయగలవవి! నిన్నటి దాకా నిజం. నేడు అది జ్ఞాపకం. కొన్ని జ్ఞాపకాలు మనసు అరల్లోనో, పొరల్లోనో ఎక్కడో చిక్కుకుని అప్పుడప్పుడు తడి తడిగా తగుల్తుంటాయి. అందుకే గామోసు, "ఆర్ద్రత" అనే శబ్దం అంత ప్రభా(వ)వంతంగా ఉంటుంది. ఒక పిలుపు నాకు ఒక మరచిపోలేని మరవరాని జ్ఞాపకం – "మాష్టారుగారూ!" అన్న పిలుపు అది. ఆ పిలుపు ఆత్మీయమిత్రులు శ్రీ గుత్తికొండ సుబ్బారావుగారి సహచరి, ధర్మపత్ని శ్రీమతి రామరత్నం గారిది. నిజానికి వారి చిరంజీవులు స్పందన, భారతి, కవిత లకు నేను మాష్టారిని. కానీ ఆమె నన్ను వృత్తిపరంగా సంభావించి ఆ పిలుపుతో పిలిచేవారు. దాదాపు మూడు దశాబ్దాల పాటు కొనసాగిన అనుబంధం అది!

స్పందన ప్రింటర్స్ బందరులో ఒక దశలో కీర్తికిరీటాలను అందుకున్నప్పుడు రమగారు... రామరత్నం గారిని మేమంతా రమగారనే పిలుస్తాం... యంత్రాల్లో యంత్రమై, అక్షరాల్లో అక్షరమై, తన భర్త గుండెచప్పుడుకు అనుధ్వనియై జీవించిన క్షణాలు నాకు ఇంకా చెరగని జ్ఞాపకాలు. సుబ్బారావుగారు మెదడైతే ఆమె గుండె! ఆయన శిల్పి అయితే ఆమె ఉలి! కాలంతో పాటు ముద్రణా రంగంలో మార్పులు వచ్చి ఆఫ్‌సెట్ ప్రింటింగ్ వచ్చాక వేరే మార్గంకోసం అన్వేషించటంలో రమ గారి పాత్ర అగ్రగణ్యమైనది. "స్వగృహ ఫుడ్స్" అన్న ఆలోచన ఆమెకు వచ్చినప్పుడు ప్రోత్సహించిన కొద్దిమందిలో నేనూ ఒకణ్ణి! సుబ్బారావుగారు ఒక అద్భుతమైన కార్యశీలి. ఆమె ఆలోచనకు ప్రయోగాత్మకంగా ఆకృతి నిచ్చిన వ్యక్తి ఆయన. ఆనాటి నుండి "గృహప్రియ ఫుడ్స్" ఇంతింతై వటుడింతై.... చివరి శ్వాస వరకు ఆమె ప్రాణంలో ప్రాణంగా నిలిచింది. ఎందరికో కమ్మని రుచుల నందించటమే కాదు, ఎందరికో జీవికను కూడా కల్పించింది. సాయంత్రం వేళల్లో ఆమె ఆ స్వీట్ షాప్‌లో నిలబడి వచ్చిన కష్టమర్లను ఆప్యాయంగా పలకరించడం... మరువలేని మరొక జ్ఞాపకం. కొంతమంది ఆమె పేరు "గృహప్రియ" అనుకుని అలాగే పిలిచేవారు. ఆమె పలికేవారు! నిజంగా కూడా ఆమె 'గృహప్రియే'!

నా అదృష్టమేమిటో గానీ, రమగారికి చెప్పుకోదగ్గ ఆత్మీయులలో నేను కూడా ఒకడిని. పిల్లల భవిష్యత్తును గురించి ఆమెకున్న అవగాహన, అందుకు గాను చేసిన సాధన అద్భుతమైనవి. ఆర్థిక ఇబ్బందులను అధిగమిస్తూ, ఎన్నో ఒడుదుడుకులను తట్టుకుంటూ ముగ్గురు పిల్లలనూ ఇవ్వాళ అమెరికాలో ఒక ఆహ్లాదకరమైన గర్వించదగ్గ స్థాయిలో నిలబెట్టటంలో సుబ్బారావు గారితో సమానమైన పాత్ర రమగారిది! అక్కడ కూడా ఆలోచన ఆమెది, ఆచరణ సుబ్బారావుగారిది.








సుబ్బారావు గారు సాహితీపిపాసి! నిరంతరం సభలూ సమావేశాలూ అంటూ ఊళ్ళు వెళ్తుంటే ఆమె మొదట్లో బాగా సహకరించారు. కానీ, ఆమె ఆరోగ్యం దెబ్బతిన్నాక భర్త తన వెంటనే అనుక్షణం ఉండాలని ఆమె తపన పడేవారు. సుబ్బారావుగారు ఆమె ఆరోగ్యాన్ని కాపాడేందుకు ఏమేం చేయాలో అన్నీ చేశారు. ఆమెకు ఏనాడూ ఏ లోటూ రాకుండా మనసుకు వెలితి అనిపించకుండా చూశారు. ఆర్థిక విషయాలలో ఆమె చాలా జాగ్రత్త వహించేవారు. సుబ్బారావుగారు దానిని మనస్ఫూర్తిగా అంగీకరించి ఆహ్వానించేవారు.

బంధువులన్నా, స్నేహితులన్నా ఆమెకు ఎనలేని అపేక్ష. తన ఇంటికి వాళ్ళు తరచూ వస్తూ పోతూ ఉండాలని కోరుకునేవారు. వారు వచ్చినప్పుడు అవధులు లేని ఆతిథ్యాన్ని అందించేవారు. ఆత్మీయులందరికీ ఇది అనుభవపూర్వకంగా తెలిసిన సత్యం!

రమగారికి ఆధ్యాత్మిక భావనలు ఎక్కువ. రోజూ ఉదయం దేవుని మందిరం ముందు కూర్చుని దీపాలు వెలిగించి భగవంతుని అర్చించే దృశ్యం ఇంకా ఇప్పటికీ నాకు సజీవమే! ముక్త్యాలలో శివాలయ నిర్మాణంలోనూ, అక్కడ జప హోమాదులు నిర్వహించినప్పుడు ఆమె దివ్యమైన వెలుగులను నింపుకున్నారంటే అతిశయోక్తి కాదు.

అయితే మృత్యువు బలీయమైంది. దాన్ని గ్రహించగలిగే శక్తి రమగారికి వుంది. హైదరాబాదు నుండి తిరిగి వచ్చాక ఆక్సిజన్ సరఫరాకు ఇంట్లోనే ఏర్పాట్లు జరిగాక ఆమెకు తన స్థితి అర్థమైంది. నేను ఎప్పటిలా ధైర్యం చెపుతూ మాట్లాడితే “లేదు మాష్టరుగారూ! ఈసారి... అలా అనుకోకూడదు” అన్నారు. ఆ తరువాత ఆమె ఎక్కువ రోజులు జీవించలేదు. విజయవాడ ఆసుపత్రిలో ఆఖరి క్షణాలలో కూడా మానవతా విలువలను చాటిన ఆదర్శ మహిళ రమగారు.

గృహప్రియ ఫుడ్స్‌కు ఎప్పుడు వెళ్ళినా ఆమె సి.సి. కెమెరాలో చూసి “మాస్టరుగారూ! ఒక్కసారి పైకి వచ్చి వెళ్ళండి!” అనేవారు. ఇప్పుడెప్పుడైనా అక్కడికి వెళ్తే ఆ మాటలు జ్ఞాపకం వచ్చి మనసు భారం అవుతుంది. అయినా అనారోగ్యం వల్ల శారీరకంగా ఆమె పడిన వేదనను దగ్గరగా చూశాను గనుక మరణం ఆమెకు విముక్తి కలిగించిందనే అనుకుంటాను. ‘జాతస్య హి మరణం ధృవమ్” కదా! ఇవ్వాళ రేపటికి నిన్న. కాలం వేగంగా ప్రపంచాన్నీ, మనుష్యుల్నీ తనతో తీసుకువెళ్తుంది. ఆ ప్రవాహంలో అందరం కొట్టుకొనిపోవలసిందే!

అయితే మరణించినా అందరి గుండెల్లో జీవించిన మనిషి రమగారు. ఆమె ఏ దివ్య లోకాలలోనో ఉండి అందించే ఆత్మీయ పరిమళాలు మనల్ని నిరంతరమూ తాకుతూనే వుంటాయని...



– డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు






## మా అమ్మత్త !

కష్టమొస్తే ఫోనుకాలు దూరంలో వున్నానంటూ
కావలసి వస్తే విమానం ఎక్కొస్తానంటూ
చేదోడు వాదోడుగా వుంటానంటూ
ఎంతసాయమైనా చేస్తానంటూ
మేము ఒకడుగు వేస్తామంటే
తాను పదడుగులు ఆలోచించి
మాకు అండగా నిలిచిన అత్తమ్మా !

అల్లుళ్ళం అన్నట్టు కాదు,
కుటుంబంతో అల్లుకుపోయేలాగా
మమ్మల్ని తీర్చిన అత్తమ్మా!

ఎక్కడో ఏడు సముద్రాల
ఆవలితీరంలో వుంటున్నా
ఇక్కడే, మాతోనే, మా ఇంట్లోనే
వున్నావన్నట్టు
అక్కడినించే నడిపించిన అత్తమ్మా !

అత్తగా నిన్ను
ఏనాడూ అనుకోలేదు
ఎప్పటికీ
నువ్వు మా అమ్మవే ...!

నీకిదే మా వందనాలు !!

- రాజేంద్ర
- దీపక్
- రమణ








# సజల నయనాలతో...

రమా!

"మనం పెళ్ళి చేసుకుందామా...." అనడిగినప్పుడు
నీ బుగ్గల్లో సిగ్గుదొంతరలు
నాకింకా జ్ఞాపకం వున్నాయి.
పెళ్ళి పీటల మీద
నీ చిరునవ్వులు, కొంటెచూపులు
నా కళ్ళల్లో మెరుస్తూనే వున్నాయి.
"పేదరికంలో ముగ్గురూ అమ్మాయిలే' అని నేనన్నప్పుడు
ధైర్యంగా అడుగు ముందుకేసి
ఆదాయ వనరుల వైపు నన్ను నడిపించిన
నీ స్థిత ప్రజ్ఞతకు నా జోహార్.
ప్రయోజకులైన సంతానం అందించే
ఆనందపుటంచులను అందుకోలేని
నీ అనారోగ్యం మనల్ని కుంగదీసినా
అనేకసార్లు మొక్కవోని ధైర్యంతో రోగాన్నెదిరించి
మనోబలానికి సాక్షీభూతంగా నిలవగలిగావు.
కానీ.... ఇప్పుడు.....
నన్నిలా ఒంటరిగా వొదిలి పోయేందుకు
నీ మనసెలా ఒప్పిందో గాని
నువ్వు లేని నా జీవితం
ఎండిన పండుటాకులా మారింది...
నువ్వందించిన మనోబలం
ఈ ఆకు ఇంకెన్నాళ్ళు కొమ్మను వదలకుండా
కాపాడుతుందో చూస్తాను....
అందాకా
నీ స్మృతిగీతల్ని కాపాడుతాను
నీ చరిత్రను చరితార్థం చేస్తాను.....



- గుత్తికొండ సుబ్బారావు






1968 – చీరాల కాలేజీ విద్యార్థినిగా రమ





1971 - గుంటూరులో సహకారశాఖ ఉద్యోగినిగా స్నేహితురాలు జయలక్ష్మితో....






1972 - జనవరి 26 గుత్తికొండ సుబ్బారావుతో వైవాహిక జీవితం లోకి ప్రవేశం






రమ తల్లిగారు శ్రీమతి ఆదిశేషమ్మ, తండ్రిగారు శ్రీ గోరంట్ల సత్యనారాయణ



రమ అత్తగారు శ్రీమతి ఇందిరాదేవి, మామగారు శ్రీ గుత్తి కొండ రామనాథం







1979 ముగ్గురు కూతుళ్ళు స్పందన, భారతి, కవిత లతో......






1980 ఆనాటి కృష్ణాజిల్లా కలెక్టర్ శ్రీ.ఏ.వి.యస్ రెడ్డిగారి సతీమణి
శ్రీమతి ఇందిరారెడ్డి మరియు డా॥జి.వి.పూర్ణచంద్ లతో ...








1982 డా॥జి.వి పూర్ణచంద్ అరుణాదేవిల వివాహసందర్భంగా



1983 తన చిన్న యింట్లో
ఆకాశమంతెత్తు ఆరాదనా భావంతో
యిష్టదైవం శివునికి పూజ చేస్తూ









1984 ఆనందపు చిరునవ్వుల్ని చిందిస్తూ......



1984 మొదటిసారిగా స్కూటర్‌పై ప్రయాణం








1985 అత్తగారితో
ముగ్గురు తోడికోడళ్లు



1985 మరిది రాములు
మొదటిసంతానం సందీప్
అన్నప్రాసన సమయంలో








1989 రెండవ కుమార్తె
భారతి, ఆమె స్నేహితురాలు
మాధవితో భద్రాచలం యాత్ర



1990 అమరావతి యాత్ర






1992 ముగ్గురమ్మాయిలతో ముచ్చటగా.....



మద్రాసు విహారయాత్ర లో పిల్లలతో....








1993 గృహప్రియ ఫుడ్స్ ప్రారంభానికి పూజ చేస్తూ



1993 గృహప్రియ ఫుడ్స్ స్థాపనకు తనకు స్ఫూర్తి నిచ్చిన నేస్తం రాజకుమారి గారిని సత్కరిస్తూ...




1995 తన చుట్టూ వున్న జీవరాసుల యెడ ఔదార్యానికి ప్రతీకగా...



1995 పెద్దకుమార్తె స్పందన వివాహ నిశ్చయతాంబూలాల సమయంలో...








1995 వివాహ సమయంలో కుమార్తెకు నలుగుపెడ్తూ....



ఉండమ్మా! బొట్టు పెడ్తానంటూ కుమార్తెకు కళ్యాణ తిలకం దిద్దుతూ






పెండ్లి కూతురైన కుమార్తెను ఆశీర్వదిస్తూ



పెండ్లికి ముందు గౌరిపూజలో కుమార్తెకు సహకరిస్తూ....








వరుడు బాల వెంకట రమణారావుకు
కన్యాదాన సమయంలో........



కళ్యాణ మండపంలో






1996 స్పందన శ్రీమంతంలో వియ్యపురాలు శ్రీమతి విజయలక్ష్మి తో కలసి



1996 చిరకాల కుటుంబ మిత్రులు, శ్రేయోభిలాషులు

డా॥మాదిరాజు రామలింగేశ్వరరావు, పర్వతవర్ధిని దంపతులతో








1997 మొదటి మనవడు చి॥వంశీ పుట్టినరోజున



1997 మనవడు చి॥వంశీ మొదటి పుట్టినరోజు వేడుకలలో....







రెండవ కుమార్తె భారతి నిశ్చయ తాంబూలాల సందర్భంగా
కుటుంబ మిత్రులు చి॥శాంతిప్రియ, చి॥ రాధికలతో...



నిశ్చయ తాంబూలాల నిమిత్తం వియ్యంకులకు స్వాగతం పలుకుతూ...
వరుడు చి॥ప్రణయదీపక్, వియ్యంకులు శ్రీ వి. ఆర్. మాగంటి, శ్రీమతి రత్న






నిశ్చయ తాంబూలాలయ్యాక....



చి॥భారతి వివాహ సమయంలో వధూవరులను ఆశీర్వదిస్తూ...








అంపకాల వేళ కన్నీళ్లతో ఒళ్లో వాలిన భారతిని అనునయిస్తూ... తానూ కంటతడి తడుచుకుంటూ....



2000 - తీవ్రమయిన అనారోగ్యం నుండి కొంచెం కోలుకుని
తన చిరకాల స్వప్నం సొంతింటి గృహప్రవేశం సందర్భంగా...






2002 మూడవ కుమార్తె కవితను నిశ్చయతాంబూలాలకు సన్నద్ధం చేస్తూ....



నిశ్చయ తాంబూలాలకు ముందు హారతిస్తూ...






నిశ్చయ తాంబూలాల వేదిక పై ఆశీర్వదిస్తూ...



వియ్యంకులకు నూతన వస్త్రాలను అందించేవేళ
శ్రీ జొన్నాదుల కోదండరాములు, శ్రీమతి రాజ్యలక్ష్మి



నిశ్చయతాంబూలాల అనంతరం తన ముగ్గురు వియ్యంకులు,వియ్యపురాళ్ళతో



ముగ్గురు వియ్యపురాళ్ళతో పసుపు కొట్టిస్తూ...








కవిత అత్త మామలకు స్వాగతం పలుకుతూ ....



కవిత వివాహసమయంలో  కుటుంబసభ్యులతో....






ఒక సాంస్కృతిక కార్యక్రమంలో చిరకాల మిత్రులు శ్రీ మండలి బుద్ధప్రసాద్‌కి అభివాదం చేస్తూ...







వేదిక పై కుటుంబ సభ్యులతో






వేదిక పై చిరకాల నేస్తం రచయిత్రి
శ్రీమతి డి. సుజాతాదేవితో......




ఎల్.ఐ.సి కో.ఆపరేటివ్ బ్యాంకు సిబ్బంది నుండి అభినందనలు అందుకుంటూ....








2002 మొదటిసారి అమెరికాలో అడుగు పెట్టినప్పుడు కుమార్తె భారతి ఇంటి వంట గదిలో.........



భారతి ప్రసవ సమయంలో ఆసుపత్రిలో ఆమెకు బాసటగా....








భారతి కుమార్తె తన్వి
సంరక్షకురాలిగా....



మనుమరాలితో ఆరుబయట విహారం



అమెరికాలో భారతి ఇంట , కవిత తో కూడి...



అమెరికాలో గ్రంధాలయాలెలా వుంటాయో చూస్తూ...






ఆ దేశంలో కూడ మన దేవుళ్ల వైభవానికి ఆశ్చర్యపోతూ....



అమెరికాలో ఆసుపత్రులే కాదు పబ్లిక్‌రోడ్లు కూడా కాలుష్యరహిత ప్రాంతాలే అని గమనిస్తూ....









ప్రపంచ ప్రసిద్ధి గాంచిన శాన్‌ఫ్రాన్సిస్కో గోల్డెన్ గేటు బ్రిడ్జి దగ్గర...



గోల్డెన్ గేటు బ్రిడ్జి పైన








గోల్డెన్ గేటు బ్రిడ్జి మధ్యలో



కుమార్తె భారతి డ్రైవింగ్ లో నగర విహారం....








అమెరికా నుండి తిరుగు ప్రయాణానికి సన్నద్ధమై తన్వి సంరక్షణ వియ్యంకులకు బదలాయిస్తూ...



శాన్‌ఫ్రాన్సిస్కో విమానాశ్రయంలో...









విమానం ఎక్కే ముందు భారతి నుండి వీడ్కోలు....



2005 ఢిల్లీ కుతుబ్‌మినార్ ఆవరణలో....









2010 "మనిషి కోసం " ఆవిష్కరణ సభలో వేదిక పై అతిథులతో...




శ్రీ మండలి బుద్ధప్రసాద్ నుండి అభినందనలందుకుంటూ.....




అక్కయ్యా అని పిలిచే డా॥జి.వి పూర్ణచంద్ నుండి చీరను స్వీకరిస్తూ ...




కుటుంబ నేస్తం డా॥కె.బి.లక్ష్మికి పుస్తకాన్ని అందిస్తూ....








మరిది వెంకటరాములు, తోడికోడలు ఇందిరతో...



కుటుంబనేస్తం శ్రీమతి గుత్తికొండ కోకిలాంబ అందిస్తున్న చీరను అందుకుంటూ....






కుటుంబ మిత్రులు శ్రీసవరం వెంకటేశ్వరరావు గారితో...



సన్నిహిత మిత్రులు డా॥రావి రంగారావు, డా॥వెన్నా వల్లభరావు గార్లతో...







డా॥ వై. శ్రీలత తన శిష్యులతో సహా వచ్చినందుకు ఆనందంగా...



కుటుంబనేస్తం శ్రీమతి కరెడ్ల సుశీలకు జ్ఞాపికను బహూకరిస్తూ...






చిరకాల కుటుంబ మిత్రులు శ్రీ విడియాల చక్రవర్తి, శ్రీమతి సుధ కుటుంబంతో...



గృహప్రియ ఫుడ్స్ పరివారం లోని తన ఆత్మీయ శిష్యురాలు రంగమణి
వివాహ కారణంగా ఉద్యోగాన్ని వదిలి వెళ్తున్నప్పుడు ఆత్మీయ వీడ్కోలు సమావేశం ..








తన యింట సుప్రసిద్ధ రచయిత్రులు
శ్రీమతి డి.సుజాతాదేవి, శ్రీమతి శీలా సుభద్రాదేవి,
శ్రీమతి ఇంద్రగంటి జానకీబాల గార్లతో ముచ్చట్లు....



2012 మరోసారి అమెరికాలో న్యూయార్కులోని స్టాట్యూ ఆఫ్ లిబర్టీ దగ్గర...






తన వెనుక న్యూయార్క్ సిటి.



న్యూయార్క్ సందర్శనలో వియ్యంకులతో...
శ్రీ కాటాబత్తుని మారుతి ప్రసాదరావు, శ్రీమతి విజయలక్ష్మి








పెద్దమ్మాయి స్పందన, చిన్నమ్మాయి కవితలతో...



అల్లుడు రాజేంద్ర, అమ్మాయి కవిత, పిల్లలు ఆర్య, మాన్యలతో...










అమ్మో! ఇంత పెద్ద దుకాణమా!
న్యూజెర్సీలోని శామ్స్ క్లబ్ స్టోర్‌లో వియ్యంకులతో కలసి ఆశ్చర్యానుభూతి...




పిల్లలతో న్యూజెర్సీ లోని యాపిల్ తోటల్లో విహారం ...








మనవరాలు శ్రేయకు నూతన వస్త్ర బహూకరణ వేడుకల్లో...



మనవరాలు మాన్య, మనవడు ఆర్యల పుట్టినరోజు వేడుకల్లో..








ముగ్గురు మనవలు, ముగ్గురు మనవరాళ్లతో ఆనందాన్ని పంచుకుంటూ....



ముగ్గురు కుమార్తెల్ని చూసి మురిసిపోతూ.....









2013 ప్రపంచ మహిళా దినోత్సవం సందర్భంగా మచిలీపట్నం రోటరీ క్లబ్ సత్కారసభలో ప్రసంగిస్తూ...




సన్మాన గ్రహీతలతో న్యాయమూర్తి శ్రీ.పి.కాశీ విశ్వేశ్వరరావు, రోటరీక్లబ్ బాధ్యులు









సన్నిహిత మిత్రబృందం
శ్రీమతి రాజకుమారి,
శ్రీమతి మాదిరాజు పర్వతవర్ధిని




సన్మాన పత్ర స్వీకారం




డా॥బి. ధన్వంతరిఆచార్యగారి అభినందనలు



కుటుంబ సన్నిహితులు శ్రీ ఎస్.వి. రత్నారావు, రాణి దంపతులు







తన ప్రియ పరివారంతో.....



తన చిరకాల స్వప్నం ఈశ్వర దేవాలయ నిర్మాణం.
కృష్ణాజిల్లా ముక్త్యాలలోని శ్రీకోటిలింగ హరిహరమహాక్షేత్ర ప్రాంగణంలో వైద్యనాథాలయం








దేవాలయంలో విగ్రహ ప్రతిష్ఠ నిమిత్తం యాగ నిర్వహణ



యాగ నిర్వహణ లో......






శరీరంలో ఏమాత్రం శక్తి లేకపోయినా యాగ నిర్వహణ కోసం తెచ్చి పెట్టుకున్న ఉత్సాహం



మూడు రోజుల యాగ నిర్వహణలో భాగస్వాములైన బంధు మిత్రులు








యాగ నిర్వహణలో తమ వంతుగా వచ్చిన అతిథి బృందం



అకుంఠిత దీక్షతో తాను నిర్మింపజేసిన దేవాలయంలో విగ్రహ ప్రతిష్ఠ కోసం ముందడుగు...








చిన్న మరిది వెంకట రాములు, తోడి కోడళ్ళు ఇందిర, సుజాత,
పెద్దమరిది చిన్న సుబ్బారావు లతో దేవాలయ ప్రాంగణంలో.....



ముక్త్యాల గ్రామంలో విగ్రహాల నగర సంచారం నిమిత్తం ప్రయాణం...








తన కలను సాకారం చేసిన దేవాలయ కార్య నిర్వహణాధికారి
శ్రీ సుబ్రహ్మణ్యం దంపతులను సత్కరిస్తున్న వేళ...



2013 చివరి సారిగా అమెరికాలో చిన్న కూతురు కవిత, అల్లుడు రాజేంద్రల
నూతన గృహప్రవేశ సందర్భంగా ఆశీర్వదిస్తూ...






భారతి, దీపక్‌లు భక్తితో నమస్కరిస్తున్న దృశ్యాన్ని చూచి ఆనందిస్తూ....



పెద్దమనుమరాలు శ్రేయ తో అమ్మమ్మ దొంగాటలు...








ముగ్గురు మనవరాళ్లకు తాను ఇండియా నుంచి తీసుకెళ్లిన ఒకే రకమైన దుస్తుల్లో చూసుకొని మురుస్తున్న వేళ...



మనవళ్లు, మనవరాళ్ల తో కలసి...

## మా అమ్మ ...

తన ప్రాణాలన్నీ మేమై పెంచింది మా అమ్మ

చాలీ చాలని ఆదాయపు రోజుల్లో మా చిన్నతనం
మాకింకా బాగా గుర్తుంది

తన ఆకలిని సగం చంపుకుని మా కడుపులు నింపేది మా అమ్మ

తను చింకిపాతలతో కాలం వెళ్లదీస్తూ
మాకు కొత్త బట్టలు కొనిచ్చేది మా అమ్మ

మా చదువులే ధ్యేయంగా తన సర్వస్వాన్ని త్యాగం చేసింది.

తన అనారోగ్యాన్ని పక్కన పెట్టి మా బాగోగులు చూసింది.

మెరుగైన ఆలోచనలతో సాటివారిలో మిన్నగా
నిలిచింది మా అమ్మ

పెద్దవాళ్ళమై, ప్రయోజకులమయ్యేసరికి, ఇప్పటి వరకు
మా జీవితాలకు వెలుగులు పంచిన మా అమ్మ కొవ్వొత్తిలా
తాను కరిగిపోయింది.

మరో జన్మంటూ వుంటే మళ్లీ మా అమ్మకడుపునే
పుట్టాలని ఆశిస్తూ....

- స్పందన
- భారతి
- కవిత

ప్రచురణ గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్ట్

82

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | GNPOIR174 | Date | 26-3-2021 |
| Front Cover | Yes | Back Cover | Yes |
| Blank Pages | CI, 81, | | |
| Missing Pages | NO | | |
| Prepared | G. Sondelli | Scanned | Kavureo |
| BOOK SIZE | H 9.5 W 7.4 | Pages | 85 |